శ్రీరస్తు.

శుద్ధాంధ్ర కంద పద్య సహిత

# శ్రీ గోపాల శతకము.

ఇయ్యది

గుంటూరుజిల్లా తెనాలి తా[illegible] ఆలపాడు వా స్తవ్యులగు

శ్రీమాన్ ధనకుధరం రా[illegible]

రచియింపబడి

---

ఇంటపాడు శ్రీవైష్ణవముద్రాక్షరశాలయందు

ముద్రింపబడి ప్రకటింపబడియె.

1924.

కాపీరైటు.] [ రు 0-2-0.

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ గోపాల శతకము.

[శుద్ధాంధ్ర కంద పద్యములు.]



క. సిరినెదనిజమెద కైల్వాల
మురిసుడివాలలుగు గుదెలు ♦ బొసగెడి విల్లు
న్మరి నిక్కపు పేరిటి చెలి
బరువడి నుండగను నాల ♦ పలె గోపాలా. ౧.

క. బుత్తిని ముత్తిని సత్తిని
సత్తుగ నీజాలి పజల ♦ ససి బ్రోవగ నీ
వెత్తితి బది వేసంబుల
బత్తుల కిది దెలియు నాల ♦ పలె గోపాలా. ౨.

క. అందముగా జెప్పెద నొక
వందను గందముల దెస్గు ♦ బద్దెములను మేల్
జెందగ నచ్చగ డెందము
వందుడుగగ గావనాల ♦ పలె గోపాలా. ౩.

క. తెనుగున గైతలు సెప్పెంట
జను గనముగ వెన్నుగుఱిచి ♦ జక్కగనని ము
న్మను బత్తులు వినుపించిన
బనుపున జెప్పెదను నాల ♦ పలె గోపాలా. ౪.

క. నెలపేరటసర తొలిపలు
కుల దొంగిల మిలుగ బుట్టి ♦ గూల్చియు వానిం
జలమున బమ్మకు నిచ్చితి
వల తొలి పలుకులను నాల ♦ పలె గోపాలా. ౫.

క. తామేలై తఱిమల వెను
పై మున్నీరునను దాల్చి ♦ బాసవాలులం
బ్రేమను గాచితి రక్కసి
పాముల గరుడుండ వాల ♦ పలె గోపాలా. ౬.

క. ఒంటరివై సొన్నాక
న్గంటగ రాసునిని దునిమి ♦ జగముల కెల్ల
న్గంటగనుండియు బ్రోతువు
పంటవలతితోడ నాల ♦ పలె గోపాలా. ౭.

క. మానిసి సింగము రూపును
బూని యసరతేని నిసువు ♦ బున్నెము నాహా

నోచ్చినమొ వెల రక్కసినిం
బొనము వోగొడితి వాల ♦ పలె గోపాలా. ౮.

క. గిటకవునై సోడిదసో
కటమట లేకుండ భూమి ♦ నగ్గులు మూడు
న్నిటవుగ నీ కిచ్చిన నది
బటువుగ ససిగొనవె యాల ♦ పలె గోపాలా. ౯.

క. చెవిబుగ్గ రుసికి గొడుకై
తివి రాజుల నిరువదొక్క ♦ తేప మడ్పితీ
వ వలను రాగవుచే నో
ప్పవు బమ్మడ వగుట నాల ♦ పలె గోపాలా. ౧౦.

క. తెల్లనిమే నల్లని వలు
వెల్ల కలప దాల్పు బలియు ♦ డేర్పడ బేరుల్
జెల్లగ వెన్నుని కన్నగ
బల్లిదమగు రూపు నాల ♦ పలె గోపాలా. ౧౧.

క. బువికిని మగనిగ మున్మరి
బువిపట్టికి మగని వయ్యు ♦ బువిపై బేరుం
దవిలితి రాగవు డనగా
బవతుల బరిమార్చి యాల ♦ పలె గోపాలా. ౧౨.

క. జగమేలిక బోరిలను బే
రుగ నదియే నీకు బేరు ♦ రూపబ్బురమై
దగబత్తులు గొల్తురు కొల
బగతుల బరిమార్తు వాల ♦ పలె గోపాలా. ౧౩.

క. కలితనపు రూపు బూనిక
గల వన్నియు నిండి బత్తి ♦ గలవారల బొ
బలుకుల సుదముచ్చట నా
బలుకుల దోచెదవు యాల ♦ పలె గోపాలా. ౧౪.

క. ఆండాళమ్మకును న్మది
నుండగ వేరితలతో నోము ♦ నోచగ బాటల్
దండిగ ముప్పది నలువము
బండబల్కనేలు దాల ♦ పలె గోపాలా. ౧౫.

క. నమ్మాళ్వారుల సొమ్ముని
నెమ్మది దిరుముడులు గొల్వ ♦ నేర్తురొ వారల్
యిమ్ముగ నీ పోరిలున బరు
వమ్ముగ నుండెదరు యాల ♦ పలె గోపాలా. ౧౬.

క. ఉడయవరు దిరువడుల దిరు
ముడు లెత్తిగెద మెడను వంచి ♦ దిరుపవడమునం

గడుబ్రోవు మనుచు నుడివెడు
వడిగను నపుడేలు దాల ♦ పలె గోపాలా. ౧౭.

క. మనవాళరుసివి జిలువల
దణివి నఱవ చదువుల నెద ♦ దాల్చెల్లరకుం
గన బలికితివి జవిబువి
వనటుడుగగ నీవ యాల ♦ పలె గోపాలా. ౧౮.

క. తెలుగు నెఱవు భేరయ వా
రుల కయవారులను నీరు ♦ రూపుల దనరం
గొలచెద నెప్పుడు బత్తిని
వల మురిదాల్పనుచు నాల ♦ పలె గోపాలా. ౧౯.

క. ఒంటరి వేలుపవై మరి
నొంటిగ నిను జూచు వారి ♦ కొంట్రరి గాక
జ్జంటగ దగి బ్రోవగ పజ
పంటగ నుండెదవు ♦ యాల ♦ పలె గోపాలా. ౨౦.

క. రెంటిని విడిపించియు మరి
రెంటిని మఱపించి మీదు ♦ రెంటిని బట్టౌ
రెంటిని బొందును పజ గడు
బంటవలతి మగడ యాల ♦ పలె గోపాలా. ౨౧.

క. మూఁడెఱిగిన మూఁడుడిగిన
మూఁడింటిని దెలియ నెల్ల ♦ మూఁటిని గన్నం
జూడవు దయసేయఁగ మది
బాడిగ పజలకును నాల ♦ పలె గోపాలా. ౨౨.

క. నాలుగు తొలి పలుకులు గల
నాలుగు యక్కరములందు ♦ నాలు గెఱుంగ
న్నాలుగు జివరుంచిన నెద
వాలగు నిను జేర నాల ♦ పలె గోపాలా. ౨౩.

క. ఐదింటి నగుచు నిరువది
యైదింటను దానటంచు ♦ నైదిట దెలిపి
నైన్దింటి గ్రోలి పజబుని
పైదగు గడతేర్చ నాల ♦ పలె గోపాలా ౨౪.

క. ఆఱుడిగిన నాఱెఱిగిన
నాఱింటిని బాడ సీకు ♦ నందమ మదిలో
దూఱుట లితరుల నుడిగిన
బాఱును నటులెపుడు నాల ♦ పలె గోపాలా. ౨౫.

క. ఏడింటి నెఱిగి మఱియును
నేడింటిని దొలగి మదిని ♦ నేడు జగంబుల్

నేడు గల మేనుదాల్పులు
బాడిగ నిను గనుదు రాల ♦ పలె గోపాలా. ౨౬.

క. ఎనిమిది బత్తుల నెఱిగిన
నెనిమిది బొగఱులను నుడుగ ♦ నిటు మంతరము
న్నెనిమిది యక్కరములు గల
వని తెలిసిన నేలు దాల ♦ పలె గోపాలా. ౨౭.

క. తొమ్మిది చుట్టల నెఱిగియు
దొమ్మిది జదువులలో ససిని ♦ దొర మెరుంగం
దొమ్మిదలగనము నీచే
వమ్ముడుపుచు గాచు నాల ♦ పలె గోపాలా. ౨౮.

క. పది వేసములను దాల్చెద
బదిపదులని దీవెనలను ♦ బజలకు జేయం
బది దెసల నీవజూచిన
బదిలముగానేల నాల ♦ పలె గోపాలా. ౨౯.

క. చక్కని మెయి నిక్కపు కయి
తెక్కువ జెయిదములు నీకు ♦ నెంతో సుకంబై
దక్కెను మయి గుఱ్ఱము మేల్
పక్కి మెగద నోయి యాల ♦ పలె గోపాలా. 30.

క. నిను గని మును దపసులు నెద
గనుఁచుందురు సంతోసంబు ♦ గల కాలము వా
రిని గని మ్రొక్కిన మనిసెద
వనటుడుగును దప్ప కాల ♦ పలె గోపాలా. 30.

క. బళిబళి నీ సోయగ మది
బళిరే మానిసుల బ్రోవ ♦ బల్కిన పల్కుల్
బళిరయ్యా జగము లేలెడి
బళువు పడుట కీవ యాల ♦ పలె గోపాలా. 32.

క. ఎందరినో యేలితి విటు
లందమి దీరంగ గొంద ♦ లం బెదబాయం
గందును మీదిరువడిగళు
బందలెటుల గందు రాల ♦ పలె గోపాలా. 33.

క. అందముగను జందముగను
డెందము జగములను బ్రోజ ♦ టెంకిని బొందం
జెందిరి సంతోసంబుల
బంద జనులు దెలియ నాల ♦ పలె గోపాలా. 34.

క. అంకులతేనికి దమ్ముడ
వంకన మెదగల్గువాడ ♦ వయ్యావు పజకుట

న్బొంకులు గావివిదలిసిరి
వంకలు నెంచ కిక నాల ♦ పలె గోపాలా. ౩౫.

క. మూడవలగనము పేరిట
బాడిన మంతరము నీకు ♦ బాగాయుండుం
బోడిమి దిరుమంతరమే
బాడినను న్మేలె యాల ♦ పలె గోపాలా. ౩౬.

క. వెనుకటి పద్దెము రెంటికి
జను నందలి పలుకు లెల్ల ♦ జగముల దెలియుం
గనుగొను ముత్తినిపజ బలు
బనివిన ససిబత్తి నాల ♦ పలె గోపాలా. ౩౭.

ఓష్ఠ్యకందము. వమ్ముద్ప మామమామా
బమ్మబ్బా మామమామ ♦ బావమోము మేల్
వామీ బాబూ బ్రోవుము
బాముఁ బమబోవ నాల ♦ పలె గోపాలా. ౩౮.

క. ఎనిమిది రోయిని రోజున
నెనిమిదొ చూలునను దల్లి ♦ కెలమిని బుట్టం
గను వెన్నుడనుచు బేరిడ
బణతులు మేలొంది రాల ♦ పలె గోపాలా. ౩౯.

క. సిరి నీలా నేలలు నీ
కరయుగ ముగ్గురట బెండ్లి ♦ యాలులు గనగా
మరి గలరట సంతోసము
బరగగ నబ్బురము నాల ♦ పలె గోపాలా ౭౦.

క. కయ్యపుబువ జడదారికి
నయ్యయ్యవు జియ్య వెన్న ♦ నందరికిని నీ
వెయ్యెడల గావజూడగ
బయ్యెడులకు గావు యాల ♦ పలె గోపాలా. ౭౧.

క. ముక్కంటి పండు గోతికి
జిక్కిన నది యేమి సేయు ♦ జెప్పుమ యట్లే
జిక్కిన నిను టక్కరులెద
పక్కిగనుట మనుట లాల ♦ పలె గోపాలా ౭౨.

ఘుటుచక్కరముల కందము. అడిగిన దుడుగక బుడమిని
బుడుకు దొడుకు బుడుకు రతన ♦ ముల దనరెడి నీ
కడిమెడనన నెడదను గడు
వడి పజలను మనుచు దాల ♦ పలె గోపాలా. ౭౩.

క. జవ్వన తొయ్యలి బందకు
జివ్వన జిక్కినను నేమి ♦ సేయన్నగు దా

రివ్వున గను మోటున కీ
వవ్వెత మెదగనగ నాల ♦ పలె గోపాలా. ౨౨.

క. కను మనుమరాలు మగడవు
గను దాతకు దండ్రి వనగ ♦ గనుము న్బువిలో
జను మామ మామ యనగా
వను సిరితోడుగను నాల ♦ పలె గోపాలా. ౨౩.

క. తెల్లని దొర తమ్ముడవై
నల్లనిమే బాసవాలు ♦ నా తెలుగంటుల్
గొల్లగ గొల్వ గజమునికి
వల్లపడవు పజల నాల ♦ పలె గోపాలా. ౨౪.

క. బసనీకు దెల్లదీవియ
బుసకొట్టున దొత్తు సిరియు ♦ బువియు నిలాలుల్
యసలుప్పతి పొక్కిలి నిసు
వస మెసగగ బమ్మ యాల ♦ పలె గోపాలా. ౨౫.

క. తిరుమణి దిరుచూర్ణంబులు
దిరుముడి నొసటుంచి గయిల ♦ దిరుగుడు సంకుల్
దిరుమణి వడములు మెడలో
వరుసందగ నేలు దాల ♦ పలె గోపాలా. ౨౬.

క. తిరుమల దిరుమాళిగలో
దిరుమజ్జన మొనర జేసి ♦ దిరుముడు లెపుడుం
దిరువారాధన సేతురు
బరువడి నీ వ ♦ నియె నాల ♦ పలె గోపాలా. ౪౯

క. నూటెనిమిది తిరుపతులను
బాటలు దిరుముడుల బోస ♦ బాడిరి సాముల్
వాటిని దాసరు లెఱిగిన
బాటను సుకమొందు నాల ♦ పలె గోపాలా. ౫౦

క. మెలగుట వ్రేతల యిండ్లను
వలరాపనులకును బిలుచు ♦ వలతులు వ్రేతల్
గొలమది నీపుట్టినచో
బలి మేమని బొగడ నాల ♦ పలె గోపాలా. ౫౧

క. జున్నును బెర్గును మ్రుచ్చిలి
యన్నుల మిన్నలను గూడి ♦ యాకలిదీరం
దిన్న మగండవు వ్రేపలె
బన్నుగ వెన్నుండ వాల ♦ పలె గోపాలా. ౫౨

క. ఋషితాకురు తాకురు మూ
డవ వంగడ మడుగు బుట్టు ♦ లట నలుకొలముల్

జవ్వకగ మరి గలవట నీ
వవ్వగదె యిటుసేయ నాల ♦ పలె గోపాలా. ౫౩.
క. అయవారు సెప్ప మంతర
మయమగు నీయదియె మూడు ♦ హజ్జలు నందుఁ
మెయి దాల్పులు దిగ గనుగొన
బయిజణచియు బోతు లవా ♦ పలె గోపాలా. ౫౪.
క. చెలిమియు సింగారంబును
జెలువము నెఱజాణతనము ♦ సిరి జవ్వనముల్
గల మగడ వలరుబోడుల
వలపుల దొరవెన్న నాల ♦ పలె గోపాలా. ౫౫.
క. పిల్లన గ్రోవియు సన్నని
యొల్లెయు గటిమేను బోర ♦ నొప్పెడి సిరియుం
గొల్లగ గొల్లెతలతో వ్రే
పల్లెయు గదనుండ నాల ♦ పలె గోపాలా. ౫౬.
క. పెనుమినుకు జివర త్రోవల
ననువుగ జను గనుడ వనగ ♦ నై వ్రేపలె యి
క్కనుమని వ్రేతల దనిపిన
పనుపరి వెటుబోతో యాల ♦ పలె గోపాలా. ౫౭.

క. అద్దము రేదొర కపురము
లుద్దినివము బొలు రిక్క ♦ లుం జక్కెరలు
న్నొద్దికనని బువరుసిగెలు
పద్దిరయసమెన్న నాల ♦ పలె గోపాలా. ౫౮.

క. చిఱుతనెల నొసలు వలమురి
నఱుదెలిదామరలు గనులు: ♦ నడుగులు జిగురుల్
కఱిమొయిలు మేనునేరమి
పఱిగొనుటలు నొప్పు నాల ♦ పలె గోపాలా. ౫౯.

క. మంచిది మంచిదిగాదని
యెంచక దోసముల వారి ♦ యే జేసి గనుం
డంచెరు గెటు బ్రోతువొ నీ
పంచను మెలగెదను నాల ♦ పలె గోపాలా. ౬౦.

క. ఆఱడిపడి పుడమిని నే
నూఱట నొందుటకు నిన్ను ♦ నూఱటగాగ
న్నొఱపడ బొగడినాడను
బాఱుడ దిరుముడిని నాల ♦ పలె గోపాలా. ౬౧.

క. రకరకముల వేసంబుల
రకరకముల బనులు జేయు ♦ రాతు వెపుడు నీ

చకచక వ్రేతల వలపుల
బకబక నవ్వింతు వాల ♦ పలె గోపాలా. ౬౨.

క. సుడిగాలి బండి రక్కసు
లెడనెడ నిను నొంప దలచ ♦ నెంతయు వారి
న్మడియించి తీవు గసవుగ
బడబడ నబ్బురము నాల ♦ పలె గోపాలా. ౬౩.

క. విసమెద పుట్టువులను బె
ట్టసి యాడెడు నడుముతోడ ♦ నసరయువిద రా
విసమిరుగ నుసురు గొంటివి
పసితనమున నీవ యాల ♦ పలె గోపాలా. ౬౪.

క. ఈరేడు జగము లెలమిని
హొరాటముతోడ దల్లి ♦ కొప్పుగ గనగా
చేరెడు బొజ్జను జూపితి
వౌరా నీవె గద యాల ♦ పలె గోపాలా. ౬౫.

క. చలివెలుగుబావ కట్టికి
జెలికాడ గొనంబుప్రోడ ♦ చెన్నొడయడ నీ
గలకాల మెలమి గలుగగ
బలుసామివి బ్రోవ నాల ♦ పలె గోపాలా. ౬౬.

క. కబ్బముల నిన్నైకైదణు
లబ్బబ్బా పొగడుచుందు ♦ రందమ్ముగ నీ
వబ్బవు పజలకు దెలిసిన
పబ్బము గదరన్న యాల ♦ పలె గోపాలా. ౬౭.

క. మీాగడ జక్కెర జేర్చిన
బాగగు జవి నెట్లు మదిని ♦ బల్మరు మెచ్చుం
బోగనము నిన్ను దలచిన
పైగడుమాసియగు నాల ♦ పలె గోపాలా. ౬౮.

క. అప్పవు మరునకు బమ్మకు
నప్పవు నెద గలుగు నుసురు ♦ లందరికిని వెం
కప్పవు బువి బొమ్మల నీ
వప్పవు నాకెలమి నాల ♦ పలె గోపాలా. ౬౯.

క. బాబువు జదలేలుకు సా
హేబువు బజలకును బుడమి ♦ యింతినిసువురుఁ
బాబువు నేలుటకై నే
బాబూ యని బిలుతు నాల ♦ పలె గోపాలా. ౭౦.

క. మచ్చిక నెద లచ్చిని ముద
మెచ్చన నచ్చగను దాల్చి ♦ యిచ్చలు మనురా

దచ్చికి నెకిమీఁడన నీ
వచ్చగ నేలుదువు నాల ♦ పలె గోపాలా. ౨౧.

క. ఊయిని దొయ్యలిగా మేల్
హాయిగ జేసినది బజల ♦ కందరికిని లో
జాయను దెలియును గస్తిని
బాయగ నేలుదువు నాల ♦ పలె గోపాలా. ౨౨.

క. మగతనమున జాగంబున
సొగసున బాగడికను ♦ జిగిని ♦ సుళువున దెలివిం
దగవున దగులంబున దగు
వగకాడవు జూడ నాల ♦ పలె గోపాలా. ౨౩.

క. రామానికమన జియ్యల
రామానికమనగ పజల ♦ రామానికమై
రామానికమ్ము నాదగి
పామిడిలే కేలు దాల ♦ పలె గోపాలా. ౨౪.

క. విసదారిసూడు గుజ్జము
విసదారియొ[illegible]సెజ్జగాగ ♦ విసమె పఱుపుగా
విసదారిదాల్పు నంటుగ
బసజగముల బ్రోతు వాల ♦ పలె గోపాలా. ౨౫.

క. మల్లెను జివ్వాను గానను
నీళ్లను నంజికను నిన్ను ♦ నేటుగ దల్చిం
జెల్లునవి మానిసుల కెద
బల్లఅపులుగావు యాల ♦ పలె గోపాలా. ౭౬

క. తకతక తా౯్త యనుచును
రకరకముల బాడి యాడ ♦ రహిం నీయెదలో
మొకమున దెలియగ నగుదువు
పకపక పజనేల నాల ♦ పలె గోపాలా. ౭౭.

క. ఆలను గాచుట జద్దుల
గీలారుల గలసి మెసవి ♦ కేరుట ద్రాచుం
గాళుల ద్రొక్కుట జమునను
వాలాయము సీవ యాల ♦ పలె గోపాలా. ౭౮.

క. మొల బంగరు మొలత్రాడును
బలు ముత్తెపు సరులు బోర ♦ బరువడి రతనాల్
జిలు గుంగరములు జేతుల
వలపు లొలుక దాల్చ్చె నాల ♦ పలె గోపాలా. ౭౯.

క. తలిరుం బ్రాయపు జెలువల
వలరాపనులకును మిగుల ♦ వలసి భిలుచు చై

వుల నెన్న జిన్ని పాపల
బలిమియు నీకగును నాల ♦ పలె గో౯పాలా. ౧౦.

క. ముజ్జగము లేలు వేలుపు
టొజ్జవు రజ్జు లివి గావు ♦ యొప్పాల కుప్పా
యుజ్జగమున నన్నేలుము
పజ్జ నిలిచి యెలమి నాల ♦ పలె గోపాలా. ౧౧.

క. వలపు లొలుకు బలు మెయి నీ
కెలమిని వలపులను గలుగ ♦ నెద బుట్టువు నీ
కులుకుల కొడుకగు మిగులగ
వలతుల వలపింతు వాల ♦ పలె గోపాలా. ౧౨.

క. తిరుపవడము నను నెన్నుచు
దిరువడిగళు మదిని నిలిపి ♦ దిరుతొళసినిడం
దిరు తేరు నుంచి గొల్చుట
బరగును నది నీకు నాల ♦ పలె గోపాలా. ౧౩.

క. పులుగు బడగ బులుగుగుదిర
బులుగు నెదం బులుకు బులుకు ♦ బులుగ రిరుసులం
బులుగొను బులుమానిసి నా
వలనుగ నుండెదవు యాల ♦ పలె గోపాలా. ౧౪.

క. తిగ రూపులు ముచ్చటలును
దిగ మేనులు దిగయు నైదు ♦ దెలివి పనులు నుం
దగ నేర్చి నిన్ను గొలచిన
వగబోనేలుదువు యాల ♦ పలె గోపాలా. ౮౫

క. వగకాడవు వగలుడుపను
వగలాడుల గొల్లె తలను ♦ వగ గూడుదు వి
వ్వగ దగు దోసము లన్నియు
వగదెగు నీవలన యాల ♦ పలె గోపాలా. ౮౬.

క. వక్కాణించిన నిన్నే
వక్కాణించవలె నోర ♦ వక్కాకువలెఁ
వక్కాణము లెన్నగ నీ
వక్కాణగనంబు నాల ♦ పలె గోపాలా. ౮౭.

క. వందలు వేలుపులుందురు
వందురులుడుపుటకు గాని ♦ వందురు లెల్లఁ
వందఱ వందఱలుగ మఱి
వందఱలాడుదువు యాల ♦ పలె గోపాలా. ౮౮.

క. వంతల నుడుపగ జేజే
లెంతయు నుందురొక కొంద ♦ రెందుకు వారల్

వంతునకు వంతబో నీ
వంతున రారెవరు నాల ♦ పలె గోపాలా. ౮౯.

క. దిగువాటు లేక మానిసి
దిగుదల నెద దిగులు దీర ♦ దిగదిగ నిన్నుఁ
దిగవిడువ కెల్లవేళల
వగ దల్చఁగ గాతు వాల ♦ పలె గోపాలా. ౯౦

క. కసుగాయ దినుట విసువుట
విసవిసగొనుటుసురుపడుట ♦ బిస నొందుట యా
పసిలుఁగు గనుట బసి వలతి
బసపస బొందానె యాల ♦ పలె గోపాలా. ౯౧.

క. వెలది నిజపు ముచ్చటలును
వెల నెతుక బాసవగలు ♦ వెలపట బలిమిఁ
వెలవెల నగు సంగడి సూ
వలరాగన్నయ్య యాల ♦ పలె గోపాలా. ౯౨.

క. ముదిమిని ముదితను బెండిలి
బెదగా బొందుటయు ముద్ది ♦ బెదరెద లేకఁ
వదరక బలుకుట సుద్దిది
వదలుట గడు రద్ది యాల ♦ పలె గోపాలా. ౯౩.

క. కట్టకడ నెట్టకేనియు
బట్టపగలు దేజువంటి ♦ బలుచుట్టము నా
దిట్టముగ దొరికె నాయెద
పట్టున నీ రూప యాల ♦ పలె గోపాలా. ౯౪.

క. మగవాడవయ్యు మగువల
మగవారల మగతనముల ♦ మగుడన్మగుడ
న్మగమానికంబు నాదగి
వగపుల వగదెంతు వాల ♦ పలె గోపాలా. ౯౫.

క. సిరు లెద గోరును బువి సుక
మురువడి నెంచను గరంబు ♦ నువిదల గోర్క
సిరిదణి నీపోల్ గోరను
వరవుడ నిడుమడుగు లాల ♦ పలె గోపాలా. ౯౬.

క. రుసిదణులు మాసిటేడులు
ససిబత్తులు దచ్చి దెసల ♦ సాహేంబులు మే
లసియాడు సకులు నెప్పుడు
బసగొల్తురు నిన్నె యాల ♦ పలె గోపాలా. ౯౭.

క. సుకమగు గైపబువునకును
సుకమగు గైసరుస కెపుడు ♦ సుకమగు బజకుర్

రకరక సుకముల నందరు
పకపక లాడగను నాల ♦ పలె గోపాలా. ౯౮.

క. ధనకుధరం బను కొలమున
ననువుగ రామానుజార్యు ♦ డను పేరున బు
ట్టినవాడ నాలపాడున
బనివిందున నీక డాల ♦ పలె గోపాలా. ౯౯.

క. పది పదులు సెప్పినాడను
బదిలముగా గందములను ♦ బద్దెంబుల నె
మ్మది మొక్కి వేడు చెప్పుదు
బది రూపుల పోడ యాల ♦ పలె గోపాలా. ౧౦౦.

శ్రీమదచ్యుత శఠగోప యతిరాజ నిజ గురుభ్యోనమః.

శ్రీగోపాల శతకము.

సంపూర్ణము.



## శ్రీవైష్ణవ ముద్రాలయమున వెలకు దొరకు గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఆంధ్రనిత్యానుసంధానము మొదటి భాగము రు | 0 | 8 | 0 |
| 2. | ,, రెండవ భాగము | 0 | 8 | 0 |
| 3. | శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత సంగ్రహము | 1 | 0 | 0 |
| 4. | పురాణేతిహాస సారసంగ్రహము మొదటి భాగము | 1 | 0 | 0 |
| 5. | ,, రెండవ భాగము | 1 | 0 | 0 |
| 6. | ఆశౌచసర్వస్వము ... | 0 | 4 | 0 |
| 7. | అడ్డుబొట్టువారి యాగడము ... | 0 | 2 | 0 |
| 8. | తప్తచక్రాంకన ఖండన ముండనము ... | 0 | 6 | 0 |
| 9. | దుర్వాదనిర్వాపణము ... | 0 | 6 | 0 |
| 10. | శ్రుతిగీతలు ... ... | 0 | 2 | 0 |
| 11. | శ్రీగోదాచరిత్రము హరికథ ... | 0 | 6 | 0 |
| 12. | పంచసంస్కార రత్నాపణమ్ ... | 0 | 6 | 0 |
| 13. | పురాణోక్తసమాశ్రయణవిధిః ... | 0 | 3 | 0 |
| | శ్రీవైష్ణవ పత్రిక సంవత్సరము 1-కి చందా | 2 | 0 | 0 |

వలయువారు :—

మేనేజరు, శ్రీవైష్ణవ ముద్రాక్షరశాల,

పెంటపాడు, కృష్ణాజిల్లా.

